ఒక్క చిన్న దివ్వె

---

1980 ప్రచురణ కాలము

ప్రతులు 1000

సర్వస్వామ్యములు
రచయిత్రివి.

మూల్యము:-
ఎనిమిది రూప్యములు.

ముద్రణ:
మాతృశ్రీ ప్రింటర్సు, బాపట్ల.

లాభస్థానము
డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ,
బాపట్ల.

# ఆముఖము

రాజమహేంద్రవరపట్టణము, నన్నయాది మహాకవులు అవతరించినప్పటి నుండి, సాహితీవిమలతీర్థంగా ప్రసిద్ధినందినది. ఆ రాజమహేంద్రవరము ప్రధాన కేంద్రంకాగా, వీరేశలింగం పంతులుగారి వంటి మహామనీషు లెందరో యావదాంధ్ర సారస్వత లోకంపై వినూత్నరోచిస్సులను ప్రసరింపజేయగల్గినారు. అట్టి ప్రముఖులలోని వారే, ప్రాతఃస్మరణీయులైన శ్రీ నాళం కృష్ణరాయ కవీంద్రులు! మౌఢ్యంతో, సాంస్కృతిక దారిద్ర్యంతో క్రుంగి కృశిస్తున్న జాతికి నవ్యస్ఫూర్తి నిచ్చి, సంస్కరణోద్యమాల ద్వారా, మహిళాజనోద్ధరణ కార్యకలాపాల ద్వారా, గౌతమీగ్రంథాలయనిర్వహణ ద్వారా అకుంఠిత సేవలనొనర్చిన ధన్యజీవి; ఆయన! ఆ కృష్ణకవి కుమారియే లక్ష్మీకాన్తమ్మగా పరిణతి చెందినది. ఆయన కవితలోని స్నిగ్ధవైదగ్ధ్యదుగ్ధాల ముగ్ధమధురిమలను పరిమళింపచేయగల "ఆంధ్ర సరస్వతి" ఆమెలో సాక్షాత్కరించింది.

తొలుత "ఉభయ భాషాప్రవీణ"గా "తెలుగు మొలక"గా విద్వత్కవయిత్రి"గా, తదుపరి "బ్రాహ్మీభూషణ"గా, "సాహితీ రుద్రమ"గా, "ధర్మప్రచార భారతి"గా, సారస్వతేయులు ఆమెను ప్రస్తుతించిరి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఆమెను "కళాప్రపూర్ణ" బిరుదముతో గణుతించింది!

1953లో తెలుగు భాషా సమితివారి బహుమానము, "గృహలక్ష్మి పత్రికాధిపతుల స్వర్ణ కంకణాలంకారము, కవిత్రయ జయంతి, మొల్ల జయంతి వారల సన్మానములు 1971లో అఖిలభారత తెలుగు రచయితల సంఘ పురస్కారము, 1974లో తెలుగు ప్రపంచమహాసభలు, 1975లో చెన్నపురి ఆంధ్ర మహాసభల వారొనర్చిన సత్కారాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ విశిష్ట సభ్యత్వము, ఆమె వీణా వాదన వైశద్యానికి,

వక్తృత్వ శక్తికీ మెచ్చి యిచ్చిన స్వర్ణ పతకాలు, ఇంకా అనేకములైన బహూకృతులను, పర్యాలోచనం చేస్తే — ఈ శతాబ్దంలో శ్రీమతి లక్ష్మీ కాన్తమ్మ గారికి తప్ప, యిన్ని ఘనసన్మానాలు, ఏ మహిళా రచయిత్రికి లభించలేదని అనుకోవచ్చు.

ప్రాచీనాన్ని త్రవ్వి, పరిశోధనలు గావించి, చరిత్రాత్మకములైన గ్రంధములు రచించినవారు పలువురున్నారు. గద్యపద్యాత్మకముగా కల్పితగాధలనాధారము చేసుకొని, రమణీయముగా కవితలు చెప్పినవారూ ఉన్నారు. కాని, చరిత్రను ఇతివృత్తంగా స్వీకరించి, కవితార్ధ యుక్తితో "ఆంధ్ర కవయిత్రులు" అన్న ఉద్గ్రంథమును శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారే ప్రణీతం చేసింది. చరిత్రలో, కవితలో మహిళల సముచితస్థానాన్ని బహిర్గతం చేసింది. చరిత్రను కావ్యభాషలో చెప్పగల కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ మహోదయుల వైశిష్ట్యం మరల యీమెలో గోచరించింది. "అఖిల భారత రచయిత్రుల జీవితము"లను సంపుటీకరించడము, మరియొక అద్వితీయ మైన సారస్వతవ్యవసాయము! తన పితృపాదులు శ్రీ కృష్ణరావుగారు ఏర్చి కూర్చిన "ఆంధ్ర సాహిత్య విజ్ఞాన సర్వస్వమును సశాస్త్రీయంగా ఉపబంహ్మణం చేసి, విద్వాంసుల మన్ననల నందుకొనడము, ఒక విశేషము!

వివిధ సారస్వత పత్రికలకు, గ్రంధాలకు, అందించిన విమర్శలు, వ్యాసములు, కధలు, పీఠికలు, అభిప్రాయములు, ఒకచోట రాశి పోస్తే, ఒక బృహత్తరగ్రంథమే అవుతుంది!

రచయిత్రిగా, కవయిత్రిగా, విదుషీమణీగా, మనస్వినిగా, కార్యదీక్షాదక్షురాలుగా, అన్నిటికంటే అనుపమానగాంగనిర్ఝరసదృగ్ధారాళ వాగమృతస్రవంతిగా, ఆంధ్రోద్యమ, మహిళోద్యమ, సత్యాగ్రహోద్యమ, సాహిత్యోద్యమ, ధర్మప్రచారోద్యములలో ప్రముఖపాత్ర వహించిన దేశ సేవాసక్తగా శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారిని ఆంధ్రదేశానికి పరిచయం చేయడమంటే దివ్వెతో సూర్యుణ్ణి చూపినట్లే!

ఆమె దేశం నాల్గు చెరగులా పర్యటనలు సల్పుతూ ఒనర్చిన ప్రసంగాలు షుమారు మూడువేలకు పై సంఖ్యలో ఉన్నవంటే ఆశ్చర్య చకితులం కాక తప్పదు.

1972లో భారత ప్రభుత్వంవారు సాంస్కృతిక వినిమయశాఖ డెలిగేటుగా పంపిన తరుణంలో తూర్పుజర్మనీ, చెకొస్లొవేకియా, రష్యా, కెనడా, అమెరికా దేశాలలో పర్యటనలు సల్పి, భారతీయసంస్కృతీ స్వధర్మముల ప్రబోధ ప్రచారాలు దిగ్విజయంగాచేసి వచ్చిన ఏకైక ఆంధ్ర మహిళ శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు!

ప్రశాంత వాతావరణంలో కూర్చొని, సుఖాసీనురాలై ఆలోచ నలకు పదనుపెట్టి చిత్ర విచిత్రపుటూహలతో పుంఖానుపుంఖంగా రచనలు గావించి వారపత్రికలను నింపే రచయత్రి మాత్రం కాదు, లక్ష్మీకాన్తమ్మ గారు!

ఆమెకు కొన్ని లక్ష్యములున్నవి. కొన్ని ధ్యేయములున్నవి. అవి విశ్వశ్రేయార్థమైనవి. తన జాతి జనోద్ధరణకు సంబంధించినవి. ఆ లక్ష్యసిద్ధికై మాత్రమే, ఆమె రచనలు చేస్తుంది.

ఈ క్రింది సంస్థలతో ఆమెకున్న సంబంధములు, ఆమె ధ్యేయాలను విశదపరుస్తాయి.

(1) ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడామీ (2) బాలల ఎకాడమీ (3) తెలుగు భాషా సమితి (4) విశ్వహిందూ పరిషత్ (5) గోరంట్ల వెంకన్న ట్రస్టు (6) ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభ (7) వేటపాలెం సారస్వత నికేతనం (8) రాజమండ్రి గౌతమి గ్రంథాలయం (9) రాజ మండ్రి ఆంధ్ర మహిళా గానసభ (10) రాజమండ్రి ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల (11) ఆంధ్ర రచయితుల సలహా సంఘం (12) సంస్కృత సలహా సంఘం (13) గిల్డ్ ఆఫ్ సర్వీస్ (14) ఆంధ్ర విశ్వ విద్యాలయం-సెనెటు (15) రేడియో సలహా సంఘం (16) ఆంధ్ర స్టేట్ సోషల్ వెల్ఫేరు సలహా సంఘం (17) బాపట్ల వుమన్స్ కోపరేటివ్ కాలేజి

యిండస్ట్రీస్ (18) కేంద్ర సాహిత్య అకాడెమీ (19) స్త్రీహితైషిణీ మండలి వంటి అనేకములైన సంస్థలలోసభ్యత్వమో, అధ్యక్షస్థానమో కల్గి, వాటితో సత్సంబంధాలు నెఱపుతూ నిరంతర సేవా తత్పరయగు శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు జగద్విఖ్యాతురాలైనారు.

1948లో కీ. శే. బత్తుల కామాక్షమ్మగారి షష్టిపూర్తి ఉత్సవ సందర్భంగా ఆంధ్రయువతీసంస్కృత కళాశాలకు రు. 35000 రూప్య ముల నిధిని, 1965 లో అఖిల భారత రచయిత్రుల ప్రథమ మహా సభ లకు రు. 25000 నిధిని, విశ్వహిందూపరిషత్ప్రక్షాన అపారమైన నిధిని, ఎంతో శ్రమించి సంపాదించి పెట్టడం ఒక్క లక్ష్మీకాన్తమగారికే తప్ప అనితర సాధ్యం అనడము అతిశయోక్తి కారాదు. వట్టిమాటలు కట్టిబెట్టి గట్టి మేల్ తలపెట్టమని గురజాడ వారన్నారు. లక్ష్మీకాన్తమ్మగారుచేసి చూపెట్టినారు.

ఇంతటి అమేయమైన మహోన్నతమైన వ్యక్తిత్వము శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి కెల్లా లభించింది?

అటు బాల్యావస్థలో తన పితృపాదులయొక్క చరణ సన్నిధిని విద్యను నభ్యసించడమేగాక, వీరేశలింగంగారి సంస్కరణోద్యమం, బ్రహ్మ సమాజ తాత్త్విక దృక్పథంలోని ఏకేశ్వరోపాసనా విధానం; ఒక పాయగా పారింది. ఇటు సనాతనసంప్రదాయపరాయణులైన ఊటు కూరి వారి యింటి కోడలై, విమలవిచారుడు, గీర్వాణవాణీవిలసితుడు, రసజ్ఞుడు అయిన శ్రీ హయగ్రీవగుప్తగారు తన పతిదేవులుకాగా, సనాతన సత్సంప్రదాయ సమ్యగ్దర్శనం రెండవ పాయగా ప్రవహించింది. ఈ రెండు పాయలను గంగా యమునా స్రవంతులుగా భావిస్తే, అంతర్వా హినిగా ప్రవహిస్తున్న తనలోని సరస్వతీనది కలసి, త్రివేణీ సంగమంగా రూపావిర్భావంపొంది, ఇంతటి వైశిష్ట్యానికి హేతుభూతమైంది. అందుకే, ప్రాచీన వర్తమాన భవిష్యత్ కాలీన భావ వీచికల సమన్వయం, భార తీయ తాత్త్విక దర్శనంలోని "సత్యం, శివం, సుందరం" యొక్క ప్రత్యయం, ఆమెలో గాఢమైన ప్రభావం కల్గించాయి.

ప్రాచీన సాంఘిక దురాచారాలను ఆసరాగా తీసుకుని సనాతనాన్ని దుయ్యపట్టడమూ, సమాజంలో మహిళలకు జరిగిన అన్యాయాన్ని కారణంగా తీసుకుని, పురుషజాతిపై ద్వేషజ్వాలలను రగల్చడమూ ఆమె అభిమతం కాదు.

ఆర్షమత సంప్రదాయాలను, సదాచారములను, ప్రాచీనులైన వాల్మీకి, కాళిదాస గీర్వాణ కవిపుంగవులను, నన్నయాది కవివతంసులను ప్రస్తుతిస్తూనే, అధునాతనులైన గిడుగు, గురజాడ, వీరేశలింగం వంటి త్రిమూర్తులను, కృష్ణశాస్త్రి దాశరథివంటి నవ్యులను బహుమానించడము ఆమెలోని ప్రత్యేకత! ప్రాత క్రొత్తల మేలికలయికలకు ఆమె, భావనా మందిరం!

"పురాణ మిత్యేవ నసాధుసర్వం, న చాపి కావ్యం, నవ మిత్యవద్యం" అన్న సూక్తికి ఆమె జీవితమే ఒక నిదర్శనం!

సార్వత్రికంగా ఒనర్చే గంభీరోపన్యాసములలో నిహితమైన భావసముదాయమే కాక, ఆమె గ్రంథస్థ మొనర్చిన రచనలు ఇందుకు ప్రబలసాక్ష్యాలు !

ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా ఉన్న గౌరవనీయ శారదాముఖర్జీకి అంకితంచేసిన "మహిళా విక్రమ సూక్తం"లో భారతీయ మహిళాలోకానికి ఆమెచేసిన ప్రబోధం వినిపిస్తుంది. సగుణోపాసనా ప్రధానము, అవతార వాద సమర్థము అయిన సాంప్రదాయభావనాసంజనిత "వాసవీ కన్యకాపరమేశ్వరీ సుప్రభాతం" సంస్కృతవాణిలో గానం చేస్తూనే, ఏకేశ్వరోపాసనా పులకితాంతఃకరణుడైన దేవులపల్లి కృష్ణశాస్త్రికి "కాంతి శిఖరాల" పేరుతో గేయకృతిని సమర్పించింది.

హిందీభాషను పునీతం చేసిన సంతకవుల సూక్తులను, గీతానువాదంగా అమర్చి తెలుగువారికి "సదుక్తి మంజరి"ని ప్రదానం చేసింది. "మన సాహితి - మధుభారతి" అనుపేరుతో, తన జాతీయ సంస్కృతిపై గల ఎనలేని అభిమానమును అక్షరగతం చేసి, అమాత్యవర్యుడైన మండలి కృష్ణారావుగారికి అంకితమొనర్చింది. "కన్యకమ్మ నివాళి"

వంటి కూనలమ్మ పదాలతో సరితూగు రచనలు వ్రాస్తూనే ప్రాచీనాలంకారిక శాస్త్ర లక్షణలక్షితములైన ఛందోమయ కావ్యప్రసూనాలను "లజ్జా కిరీట ధారిణి" అన్న మకుటం క్రింద, వెలువరించి ఆంధ్ర సాహితీయుల హస్త గతం చేసింది. "నా తెలుగు మాంచాల" అన్న కరుణ, శృంగార వీరరస పూర్ణమైన మహత్తర కృతి ఆమె లేఖిని నుండి రూపాకృతి దాల్చ బోతున్నది.

తాను కృతులను రచించడమే కాక, అత్యుత్తమ గ్రంథాలకు గ్రహీతగా స్తుతి పాత్ర అయింది. "కథా మందారము"అను పేర మహిళా రచయిత్రుల కథలను ఎంపికచేసి సంపాదకత్వము నిర్వహించినది.

ఇంత మహోజ్జ్వల చరిత్ర గల్గిన శ్రీమతి లక్ష్మీ కాన్తమ్మగారు తనకు నా యెడల గల సోదరవాత్సల్యమును పురస్కరించుకుని "ఒక్క చిన్న దివ్వె" అను పేరుగల రచనకు నా అభిప్రాయాన్ని ప్రకటించటానికి అంగీకరించడం నా భాగ్య విశేషం!

వివిధ శీర్షికల క్రింద రచించిన పదునేడు గేయముల కుసుమ గుచ్ఛము యీ "ఒక్క చిన్న దివ్వె"!

"ఒక్క చిన్న దివ్వె" యీ ఉద్గ్రంథానికి అతి ప్రధానమైనందున నామకరణం సముచితంగా ఉంది.

నిరాశాహతచేతస్కుడి భుజంతట్టి, చెప్పిన ఒక్క చిన్న వాక్యం నిరీహతో మసలుతూన్న తరుణాన పలికే ఒక్క ఉత్తేజకరమైన మాట, అజ్ఞానాంధకారంలో దారితెరువు కన్పడనివేళ ప్రసాదించిన ఒక కరదీపిక ఎట్టి మహోపకారం చేస్తుయ్యో తెలుసుకొన్నప్పుడు "ఒక్క చిన్న దివ్వె" యొక్క ప్రాధాన్యతను అర్థం చేసుకోవచ్చును.

క్రాంత దర్శనుడైన కవి హృదయం బాహిరజగతుల్లో జరిగే కొన్ని సంఘటనలకు స్పందించి, అంతశ్చేతన ఉన్మీలనం చెందగా, శబ్ద రూపంలో భావాభివ్యక్తికి అవకాశాన్నిస్తుంది. ఆ అభివ్యక్తములైన రచనలను పట్టి, కవియొక్క అనుభూతి విదిత మవుతుంది. ఇట్టి విశేషం వివిధశీర్షికలలోనున్న యీ గ్రంథంలోని రచనలవల్ల తెలుసుకోన గలము.

పారతంత్ర్యం క్రింద క్రుమ్మగిపోతూ, అంధతామిశ్రంలో కొట్టు మిట్టాడుతూ, బానిస బ్రతుకులు వెళ్ళారుస్తూ, హతాశులై యున్న భారత భూమిలోని కోట్లమందికి, మహాత్ముడు "ఒక్క చిన్న దివ్వె!" కాదా! ఆయన వెలిగించిన దీపము కాలాంతరాన విశ్వరూపం ధరించి 'అహింసా జ్యోతి'గా అందరిలో వెనుగుబాటలు తీర్చి, బ్రిటీషు ప్రభుత్వం పాలిటి, బడబానలం కాలేదా? ఒక్క చిన్న భావవీచిక, ఎట్లో ప్రచారం గడించి, మహా విప్లవాగ్నులను సృష్టించి, చరిత్రలో ఎన్ని పరివర్తనలకు కారణం కాలేదు!

ఈ చిన్న దివ్వె యొక్క శక్తి అపారమైనది.

"నీవారసూకవ త్తన్వీ పీతా భాస్వ త్యణూపమా
తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః"

యావద్భారత జాతిని ఒక శరీరంగా పోల్చినప్పుడు, మహాత్ముడు "ఒక్క చిన్న దివ్వె"గా పరమాత్మతత్త్వమునకు ప్రతీకగా ప్రశంస నీయుడు అవుతాడు. అందుకే – వ్యంగ్యవైభవంతో పరమరమణీ యంగా నడచిన కవిత– "ఒక్క చిన్న దివ్వె!" వాచ్యంగా, శబ్దార్థా లంకార శోభతో నుడివిన గీతం! — "ఓ మహాత్మా! ఓ మహితాత్మ!" అన్న గేయం.

"నిన్ను పూర్వ ఋషులపోల్చి మహర్షియనుట మా వాచాలత
వారికేది అర్హమైన యీ ఘనత!"

అని మహిత్ముని సంబోధిస్తుంటే, శ్రీ విశ్వనాథవారు మహాత్ముని గురించి "శ్రీమద్భారత భాగ్య హేతుకృత వర్షీయాంశుడా! త్వత్తపశ్శ్రీలో కములన్ వ్యయించెదవు మాతృక్ష్మావిముక్త్యర్థమై; ఏ మౌనీంద్రులు మున్ను చేయరు సుమీ యీ రీతి...." అన్న పద్యభాగం గుర్తుకొస్తు న్నది.

"లల్ల ఆత్మసాధన" ఒక విశేషమైన ఆధ్యాత్మికానుభూతిలోని చిద్విలాసవర్ణనము!

రచయిత్రి కాల్పనిక జగత్తులో ఎంత ఉన్నతశిఖారారోహణం చేయగలదో, అంతగా యదార్థభౌతికప్రపంచ సమస్యల ప్రత్యయం కల్గి, వాస్తవిక పరిశీలనం చేయకలదు.

జగద్ధితమును కాంక్షించే భారతీయ సాహిత్య సమ్యగ్దర్శనం చేసిన విదుషీమణి కనుకనే, ఆనంద, పింగళ, నల సంవత్సరాగమన సందర్భాలలో చేసిన ఆమె రచనలు, మహోదాత్త భావ సమన్వితములూ, ప్రబోధాత్మకములు, కాగలిగినవి.

త్యాగాలయవారి యోగ భూమిలో "రాగాలయవారి భోగ మహల్" చదువుతున్న సమయంలో రచయిత్రికి, ప్రస్తుత సమాజం తొక్కుతున్న పెడదారులపట్ల ఎంత ఉద్విగ్నత ఉన్నదీ తెలుస్తుంది.

ప్రతి కవితను ఈ విధంగా పరిశీలించుకుంటూపోతే, మరింత గ్రంథం కావచ్చును.

కనుక, "ఒక్క చిన్న దివ్వె", కళాప్రపూర్ణ శ్రీమతి లక్ష్మీ కాన్తమ్మ సోదరీమణి ఆంధ్రలోకానికి వెలిగించిన మరొక మహోజ్వల దీపశిఖ అనుకుందాము.

మధుర కవిత యగుచు సుధలను జిందించి
తెలుగు జగతి కెవరు వెలుగుఁ దెచ్చె
ప్రథితి నిచ్చు నామె ప్రాజ్ఞయై, సాహితీ
ప్రథమ పీఠమెక్కు పరమపూజ్య

జి. వి. జ్వాల నరసింహశాస్త్రి
B. Com., B. L.
అడ్వకేటు, బాపట్ల.

—[ ౦ ]—

## చిన్న దివ్వె వెలుగులు :—

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి

ఆదరములకు

శ్రీ గాదంశెట్టి చలపతిరావు

అధ్యక్షులు

పశ్చిమ గోదావరి జిల్లా రైస్ మిల్లర్స్ అసోసియేషన్

గారి, ఆదరమునకు ధన్యవాదములు.

# ఒక్క చిన్న దివ్వె

## ఓహో మహాత్మా
## ఓ మహితాత్మా

ఓహో మహాత్మా , ఓ మహితాత్మా
నీ మోపిన పదముజాడ సకలతీర్థ మనుగమించె
నీ యెత్తిన కరమునీడ శాంతిదేవి విశ్రమించె
నీ పల్కిన పల్కుచాయ శ్రుతిశిరములు ప్రతిరవించె
నీ పిల్చిన పిలుపునంది భువనపాళి తలలువంచె

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా॥

సకలభూతసమహితాత్మ
సర్వలోకహితరతాత్మ

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా॥

నిన్ను పూర్వఋషుల బోల్చి మహర్షియనుట
మావాచాలత,
వారికేది ఆర్షమైన ఈ ఘనత!
సత్యాహింసలె నిత్యవ్రతముగ
స్వార్థత్యాగము విధికృతముగ
జీవనపథము నధిగమించిన
ధైర్యహిమాద్రివి

సర్వస్వము త్యజియించిన
త్యాగహేమాద్రివి
నిన్ను పూర్వఋషుల పోల్చి మహర్షియనుట
మావాచాలత!
వారికేది ఆర్షమైన యీ ఘనత!

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా॥

ఏడువారాసు లెత్తివచ్చినను
చలియింపని మేరుధీరుడవు!
ఈరేడు భువనాలు కత్తిగట్టినను
ధర్మబుద్ధి నెదురించెడు మేటివీరుడవు!
ధర్మము నీయాకృతి ధరణివెలసి, సృష్టి
ధర్మమును కురిసె నరులహృది నమృతవృష్టి

ఓహోమహాత్మా, ఓ మహితాత్మా॥

నీత్యాగము దళితజాతిశ్రేయోయోగము
నీరాగము క్షుభితలోకహితపరాగము
రాగమందు త్యాగబుద్ధి జొనిపి
రాగభోగమ్ముల త్యాగమ్మొనరించిన
రాజయోగినీవు!

ఓహో మహాత్మా. ఓ మహితాత్మా॥

క్రాంతిపథమున సాగిన నీ పయనం
శాంతి పద మభిలషించు లోకాలకు మంగళచయనం.
శాంతియందు క్రాంతిచేర్చి
సత్యాగ్రహ సమరమేర్చి

రవిక్రుంగని బ్రిటిషురాజ్యహరికి సటలుద్రుంచి
భారతీయ బాలభానుకిరణకాంతిచ్ఛటలు పెంచి
స్వాతంత్ర్యామృతమును తెచ్చినావు
సహోదరులకు పంచి యిచ్చినావు

ఓ మహాత్మా, ఓ మహితాత్మా.

నీ దన్నదె లేదు నీకు ఏవేళను ఇది నిబద్ధి
నాదియుచి విశ్వహితసమేళన బుద్ధి
మసలి, మహికి మాన్యత గూర్చిన మహాత్ముడవు
మనుజజాతి, సమైక్యత దీర్చిన మాన్యుడవు
నీవు సల్పిన పోరాటము నీకొఱకుగాదు
నీవు తీర్చిన ఉద్యమము నిను సుఖపెట్టలేదు
అయినగానీ యెఱుగవు విశ్రాన్తి క్షణము
అహింసాధర్మయుద్ధవిక్రాన్తిని నీజీవితమె పణము

ఓ మహాత్మా, ఓ మహితాత్మా

పరిపంథుల హృదయ వైరగ్రంథులందు
ప్రేమగంధ మొలికించిన గాంధి వయ్యా
భుజస్కంధమందు ప్రజల దుఃఖదైన్య
భారమ్మును మోచి, కలత తీర్చిన దైవసమస్కంధివయ్యా
ప్రతిక్షణమును పరహితమును
పాటించిన పావనుడవు
కులమత భేదమ్ము బాపి
మనుజజాతి నొకరీతిగ
భావించిన పండితుడవు॥

ఓ మహాత్మా, ఓ మహితాత్మా॥

పరపీడన నుక్కుదక్కి భరతజాతి క్రుంగె
పరమార్థము నీవు దెలుప జాతి యెంతొ పొంగె
నీ నడచిన బాటవెంట కోట్లు కోట్లు నడచిరయ్యా
నీ చూపుడువ్రేలు దిశగా ముందుకు, మున్ముందుకు గడచిరయ్యా
నీ మాటయె వేదముగా పలుహింసల కోర్చిరయ్యా
నీ బోధల పాటించుచు స్వాతంత్ర్యము తీర్చిరయ్యా

ఎంత గొప్ప మానవుడవు బాపు!
ఎంత గొప్ప చరిత నీది బాపు!

ఓహో మహాత్మ, ఓ మహితాత్మా॥

మట్టి మెదపి మణిదీపము లుంచినావు
మానవతాప్రాప్తికినై దానవత మాయించినావు
మట్టిని మాణిక్యము నొకరీతిగ
సమబుద్ధిని పాటించిన పండితుడవు
మానవోత్తముడై భాసించిన తేజోమండితుడవు

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా॥

పావుకోళ్లు, గడకఱ్ఱయు, గావంచా గడియారము
నీయాస్తి పాస్తులు గదయ్యా నాడు
ఆ యాస్తికి వారసులెవ్వరు
లేరు గదయ్యా నేడు
ఉన్నతమై పరిఢవిల్లు నీ శీర్షము
ఉత్తమవ్రతులొ ఉర్వీజనుల హర్షము
కుటిలజాతి కూహకములకు దుర్ధర్షము
ధ్యాననిరతి మొగుడువడిన నీ కనులు

ఆర్షమౌ. వంస్కృతివిజ్ఞానపు ఖనులు
భరతజాతిభాగ్యామృతధునులు
నీమనికిని మాన్యమైన కాలము
మనుజలోకచరితకె కడు మాన్యము
మానవతాదీప్తికి ప్రాధాన్యము

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా॥

నీ బోధల మూలమున నెలవిటీసిన
జ్ఞానకమలమయ్యె! జనత; గాంధి!
దాని మూలమందు శీలపరిమళమ్ము
నించె; కస్తూరిగాంధి!
ఆదిదంపతులు మీరూపున భువిని వెలసిరహోహో
వేదమె మీ చరితగ రూపొందుచు విలసిల్లెనహో

ఓహో మహాత్మా, ఓ మహితాత్మా॥

# కరిగిపోయిన నీ బంగరుకల

మాలో కొందఱు నీకు అర్జీలంపించేరు
మఱల నిన్ను భువికి పిలువనంపించేరు
కాని మహాత్మా నాప్రార్ధనమాలింపుము
ఈధర, నీవూహించిన ఉజ్వలమౌ ఉర్వర కాదు
ఈయిల, అలనాడు నీవు కాంచిన నీబంగరుకల కాదు
బంగరుకల కానేకాదు బాపూ!

ఏవసుంధర నొకేయొక సోదరజాతిగా భావించి శ్రమించితివో
ఆధర, నేడుమనిషిమధ్య నభేద్యంబౌ అడ్డుగోడయై
విస్తరించినసుమా!

ఏయైకమత్యసాధనకై ఉసురుల వీడితివో
ఆయైకమత్యమునకు పెనుసమాధి గట్టి మంగళగీతి పాడితిమిసుమా॥
బాపూ! ఆనీబోధలు మావీనులనింకను రింగురని
మ్రోగుచుండెనయ్యా.

ఈ కుటిలదాంభిక వాదములెట్లు విశ్వసింప గలమయ్యా
బాపూ, ఆనాటి నీ దివ్యాదేశము మాహృత్సీమల బాసిపోలేదయ్యా
ఈ వికృతస్వార్ధపిశాచనృత్యరీతుల నెట్లోర్వగలమయ్యా
బాపూ. అలనాటి నీ సత్యాగ్రహశక్తికి
బ్రిటిషువారి అగ్గిదొరలు బుగ్గిని బ్రుంగుడుపడిపోయినారు
కత్తినెత్తని మెత్తని నీశాంతిసమరశక్తికి
ఉడుకులెత్తి నెత్తికి చేతులేత్తుకొని ఆంగ్లేయులూడని పారినారు
అలనాడు ప్రతిభారతపౌరుడును కాకలుదీరిన
ఒక స్వతంత్ర వీరసింహము!

ప్రతియంగణమును మోహరించిన
సత్యాగ్రహసమరాంగణము!
ప్రతిమహిళయు ఒక కరాళకాళిక!
తెలతెలవారునో లేదో, ప్రతివీధిని
స్వతంత్రయోధుల ఫౌజులు
ఇలుపెడలిన ఇందువదనల
వీరవిక్రమాటోపపు తేజులు
గటియ కొక్కవార్త! గంట కొక్క సన్నద్ధత!
ఊపిరియాడని సంచలనము!
ఊరటకోర్వని చైతన్యము!
ఉక్కిరిబిక్కిరియై బ్రిటిషుసింహము
వంజాముడిచి పారిపోయెగదా బాపూ!
వీనుల రింగురనుచుండెనా బోధములు
కన్నుల గట్టుచుండె నాదృశ్యములు!

నీ అకల్మష చరిత్రవృత్తిని
నీ అకలంక సేవాసక్తిని
నెఱిగినమేము అవినీతిని
క్రుళ్ళి పురుగులుపొఱు నీభువికి నిన్ను
మఱలనెట్లు పిలిచేమయ్యా!
మహాత్మా నీవు రావద్దుసుమా
మఱల భువికిరావద్దు!

జాతి పునర్నిర్మాణము నీభావన!
జాతిభాగ్య నిర్మూలన మాయోచన!
అస్పృశ్యత రూపుమాపి హరిజనుల గావించుట నీమతము!
పదవికొఱకు పెంపుకొఱకు

సోదరుల నస్పృశ్యులుగ హింసించుట మాహితము!
మనుజులందైకమత్యము నీసాధన!
మంత్రిపదవి కొఱకు సాటి
మనుజులందు రక్తపుటేళ్ళు పారించుట మాకామన!
నీవు చూచి యోర్వగలవె! యీయకృత్యము!
నీయెద సైచునె! యీ యానురకృత్యము!

ఓ మహాజాతిపిత!
ఓ మహామానవ చక్రాధినేత!
ఓ మహానాయకోత్తమ!
ఓ మహాజగద్గురుసత్తమ!
ఓ మహాదీనజనబంధూ!
ఓ మహాకరుణాసింధూ!
ఓ మహాశాస్త్రపండిత!
ఓ మహామనుజలోకమండిత!
మా హృదయసీమలందు నిలిచి
మా తలపులను మంచి
మాకు హితము నేర్పి
మాకు ధర్మమతము చూపి
మమ్ము నేలలేవా
మా గాంధిదేవా!
నీకు జోతలిత్తుమయ్యా
మమ్ము బ్రోవుమయ్యా

ఓహోమహాత్మా, ఓ మహితాత్మా!!

## లల్ల ఆత్మసాధన

లల్ల ఆత్మసాధనలు ఇంకా అపరిపక్వస్థితియందున్నప్పటి
<u>ఆమె ఆవేదన:-</u>

ఏను తపియింతు నీకయి తపియింతు మిగుల
ఈ ప్రాకృతికమాయ నినుగ్రమ్మె నత్యంతప్రభల
నీదు సందర్శనాకాంక్ష నేడ్చితినో జీవ! గుండె పగిలి,
నిన్ను ప్రకృతిబద్ధునిగ జేసెడు లోహలాంగలి
ఈ వస్తువితతి! తచ్ఛాయయున్ మిగుల దినుమంత
ఏల నిజతత్త్వ మేమరి భ్రమింతువో అదియు వింత!
బహుళవ్యథామయోత్తాలబాధాసంకలితమ్ము
ధారవాహిక ఈ చింకిజోలె మోచి సతమ్ము

తలలు నెఱసి విఱియ తడుముకొంటి
నడుము వంగి క్రుంగ నవయుచుంటి
ఓయి ప్రభూ! యెంత అభాగ్యను; నేను:
ఓహో, నీదు సేవలనె బడలె మేను

అతిశోకశకలిస్వాంతనై విలపింతునో
వితతభవదీయమాయాభ్రాంతి హసియింతునో

ఓయిప్రభూ! ఎంతవింత నీదుమహిమ!
ఓహో ఇంత విషాదమేమొ నీదుకరుణ!
గురుని అనుకంప యిడుముల పాలుజేసె
గొఱెలకాపరి లేక నా మంద విచ్చిపోయె
చిదురుచిదురుగ చివికి పగిలె మేను
చేతనాచేతనమౌ దుర్భరగతికి లోనైతినేను

ఓయి ప్రభూ ఎంత అభాగ్యను నేను
ఓహో నీదు సేవలనె బడలె మేను

ఐదు పదియు పదునొకంతు నంత కలిసి
బ్రదుకుకడవను చేసెపో ప్రయ్యలుగను
అన్ని కలిసియు నొక త్రాట తివియుగాక
ఏల పోవలె నీ గోవు త్రోవతప్పి?

సాధనలో ద్వంద్వ పరిస్థితి:—

సుడులు దిరుగుచు ఘూర్ణిల్లు కడలి నెట్టి
పడవ దింపితి పురిలేని త్రాడుగట్టి
దైవమాలించి నా మొఱ దరికిజేర్చు
విధియు ననుకూలమై యొక్క వెలవుజూపు॥
పచ్చికుండల పోసిన నీరుపోల్కి
విచ్చిపోయెను నాయెద విఫలకాంక్ష
నెలవు చేరంగ గాంతునో కాంచలేనో
దైవమాలించు నామొఱ దయనుజూపి
దైవమాలించునాలించు దయను నామొఱల
కావు కావివెన్నటికిని వట్టిభ్రమలు

సాధనలో కొంతగడితేరిన వెనుక లల్ల
భగవంతునితో సవాలుగా నాడిన పల్కులు!

తన్నపేక్షించి యన్వేషణకు గడంగి
లల్ల అలసిపోయెను శక్తియుడిగి
అయిన యత్నించు తనశక్తికైన మించి
ఆపజాల దా యన్వేషణను నెంచి
అతని సాన్నిధ్య మభిలషించి యేతేర

తలుపులను మూసి గడియబిగియించెనౌర
త్రుంచునే తన కోర్కె నీ తుంటరితనమ్ము
పెంచునేకాని వేయింత యీ నిరోధమ్ము.
అతని సందర్శనాకాంక్ష అంచులను మోయ
అతని సంస్పర్శనాకాంక్ష బ్రదుకునే త్రోయ
స్థాణువై పోయెను అల్ల తన నిరీక్షయందు
ప్రాణమే గోల్పోవు తన పరీక్షయందు.

## సాధనాసిద్ధికల్గినవెనుక అల్ల యానందోద్రిక్తత.

కాల్చివైచెను సంతరకాలుష్యమెల్ల
చీల్చి చెండాడె నంతశ్శత్రువుల నెల్ల
కడగివైచెను ప్రకృతిమాలిన్యముల నెల్ల
పొడిచె పెనుధీరయై హృదయమును అల్ల
అతని సన్నిధి నంటి పడియుండ పడియుండ
తపసు పండగ, కృపకై వేచియుండ
అల్ల బ్రదుకు పావనమయ్యె నేడు!
ధన్యలల్లకు ధరణిని నెవ్వరీడు!
తనువుమందిరద్వారములనన్ని
తగ బిగించెను నుపాయముల నన్ని
చోరులనుబోలు శ్వాసముల పట్టి
వీరయై హృదయగుహలోన కట్టి
ప్రభుని బంధించెను కచ్చెదీరె
విభుడు కైవసమయ్యెను వెఱవు పారె
అచట నోంకార రజ్జువున తాడితు నొనర్చి
అచలు శిక్షించెను తనదు కష్టముల వినిచి
ఊదగా మఱి యూదనూగా తిత్తులను మిగుల

ప్రోది నాత్మజ్యోతి రగిలి పొగుల
అంత కాంచెను సత్యతత్త్వమ్ము నెదుట
వింత వెలిగె నాజ్యోతి లోన బయట నొకట

చీకటిన్ దాగిన అగ్రముచ్చు కవ్వించి మించి
తాకి, పోకుండ పట్టెను కడు పిచ్చలించి,
ఆరు అడవులగూల్చెను నన్నియు వడంక ముద
మార మేల్కొల్పెను నారుచక్రముల కడంక
ప్రాణమౌ ఊర్పుల నించెను ధ్యాననిరతి
ప్రకృతి స్తంభించె తత్తపోనియతి

ప్రచురమౌ సత్త్వగుణయాగ్నికీల లందు
భస్మమొనరించి హృదయమును ముందు
ఆత్మప్రభువును గాంచెపో నాదలోలు
నాధు నిర్మలు, దివ్యసౌందర్యశీలు!

రజతదర్పణ మట్లు నిర్మలమైన మనసులోన
రమణ బడసెను పరమాత్మ నిజతత్త్వమాన
అంతరాత్మకు ప్రతికృతిగా వానిగాంచెను
నంతటను దానయై కాన్పించె నంత తా నదృశ్య యయ్యె
బహుముఖమ్మగు సృష్టి తనయందె మిశితమాయె
వస్తుమయ ప్రపంచమ్ము శూన్యాన కలసిపోయె
సర్వమును మ్రింగు శూన్యమును నశియించె నంత
అఖర్వుడై నిలిచె నంతటను సర్వాధ్యక్షు డొకంత

గుణమయమ్మగు ప్రకృతి వీడునంత
కలుగు భగవదనుభవ మొకింత

వినుము భట్టు ఇదిరొ నీకు తెప్ప!
కనుము తత్త్వమ్ము తెలిసి అప్ప!

భగవదనుభవము:-

అచట మాటయునులేదు! ఇచట తలపులునులేవు
మనసు మున్నెలేదు! మమత కనగలేదు!
ఉచ్ఛస్థితియు నచటలేదు! నీచత్వమసలె లేదు
గాఢనిశ్శబ్దనీరవప్రకృతికాని, గూఢవిద్యలెకాని చొరవు అచ్చోట
అచట శివుడునులేడు ఇచటశక్తియునులేదు
అన్నిటిని మించు నానందమహార్ణవమ్ము
అంతకును నాధారమౌ పరమాద్భుతమ్ము
ఎపుడు శాశ్వతమౌ నొక యతీతశక్తి
ఇహమువరమును బాపునొక యవ్యక్తశక్తి
నీకె యెఱుకయౌ ఒక మహనీయశక్తి
కలదు కలదు అచట నిచట నిడగ ముక్తి
ఎపుడు జీవుండు ప్రకృతివీడి తన నిజభావమునుగనును
అపుడె వస్తుజాతమ్ము సర్వమ్ము శూన్యాన మఱుగువడును.
అప్పుడచ్చట వెలుగుచీకట్లులేవు, లేవ భువియు దివియు
అచట సర్వనాశకంబగు శక్తియు నాశనంబగును
అంతరాత్మవిలసనంబె నిజమగు శివారాధనంబగును
ఎవడు ప్రభువరమేశ్వరు గాంచునెందు
అతడె ద్వంద్వవిముక్తుడై వెల్గొందునెందు
ఎవడు నిఖిలప్రాణుల యందు దేకాత్మదృష్టి గాంచు
నతడె, వెలుగు చీకట్లు నడిపించుఘాని గాంచు
స్వామి! కననైతి నీవె యీ నేనటంచు
ఏమొ! కాననైతిని నేనె నీవటంచు
సంశయమ్ముల మేటి! 'ఎవ్వరీనే'నను ప్రశ్నయొకటి!
'ఎవరు నీ'వను రెండవప్రశ్నచేరు సంశయవరాంకోటి!
నీవు నేను తెలియుగ ఒకటికదన్న

నూత్న భవకారణము తెగునిది తెలుసుకొన్న
శివునిచే తతమయ్యె నీ జగతియెల్ల
హిందువునులేడు లేడు ముస్లిమును అల్ల!
తెలివి యొకయింత గల్గెనే దెలిసి కొనుము
నిన్ను నీవు తెలియు టొకటియే సుమ్ము
ధన్యునుగ జేయును నిన్ను పరమేశు దెలిపి
అల్ల భవబంధ మీగెనిది బుద్ధి నిలిపి॥

మూర్తి పూజలపై అల్ల భావము:-

మూర్తియును శిలయె. అల్లయమ్మును శిలయె
రెండు నివి యేకవస్తుసముద్భవములె
దేని నారాధనము సల్పెదో పండితుండ!
ఊర్పులన్ బిగియించి. లగియింపు చిత్తమున్ విడువకుండ

యజ్ఞయాగాదులలో హింసపట్ల అల్ల అయిష్టత:-

పడియనీటినిదాగివి పచ్చికబీళ్ళ మేసి
మానసంరక్షణార్థమ్ము. మఱి చలి నాపుటకును
గొఱ్ఱె నీకిచ్చు ఉన్నిని ఇంతింతలేసి
మూఢబ్రాహ్మణ! నిర్జీవశిలామూర్తి కొఱకు
ఈ అమాయికజీవాలచంపు డనుచు
నెవరు నేర్పిరి? ఇది నిన్నెట్లుగాచు!

## ఆనందరసహేల

తొలి ఉషసు మెరిసింది పొడుపుగుబ్బలిపైన
తొలియూహ విరిసింది రసలోకహృదయాన

తరళమై సరళమై తెలికాంతికిరణమ్ము
పుడమిపడతికి లీల గిలిగింతలను పెట్టె

అరుణమై తరుణమై అరవిందమై మనసు
మేల్కాంచి హసియించె హసియించి వికసించె

శతకోటిజన్మాలబాధలను సుడివడుచు
శతకోటిదుఃఖాలగాథలను మెలివడుచు

అంతరాంతరమందు సుప్తమై పడియున్న
ఆనందచైతన్యకుండలీవలయమ్ము

అంతరమ్ములు దాటి అంతస్సులును దాటి
అవధులన్నియు ద్రోసి అంధతమమును గ్రాసి

ఈ పర్వశుభవేళ సిరినించు సుఖఖేల
భాగ్యపారమ్యమ్ము పుడిసిళ్ళ గ్రోలుచును
పురివిప్పి యాడుచును జ్ఞానకేతనమ్మగుచు నాట్య మాడింది

* * *

జగమంతటను నిండి గగనమ్ము కెగబ్రాకు
కాంతిపూరము వెల్లువై కవిహృదయ ప్రాంగణమున

---

ఇది 'ఆనంద' ఉగాది శుభపర్వవేళ ఉషోదయమునుండి సాయం సంధ్య వఱకు నా యెడల వర్తిలిన శుభాచరణ సంవిధాన వర్ణన—

కలయంపి చల్లుచు పుక్కిలింతలునై నూత్న
భావాల కలదిరిగి రంగవల్లి కలగుచు
శృంగారములు నింప

శోకమ్ము శ్లోకమై నరకమ్ము నాకమై
విశ్వశ్రేయోరూపవిపులకావ్యశ్రేణి

వసమీరి వసవల్చు రసలుబ్ధహృదయాల
ప్రణవశంఖమ్మగుచు

మొరసింది మెరసింది
మెరసింది, మొరసింది

సకల బాధలు విరిచి సర్వదుఃఖము మరచి
సర్వమంతా కలసి సమ్యగైక్యతన్ వెలసి

సంతోషకుసుమాల పరిమళించిందహో
పరవశించింది! పరవశించిందహో
పరవళ్లు ద్రొక్కింది

పరిపరివిధములా బరువెక్కు జీవాళి
తలపువరిధావమ్ము చరమలక్ష్యమునొంద

కళ్యాణకామనల బరువెక్కి పయనింప
ప్రామాదియుగవేళ నామోదముల సెలగ

ప్రాచ్యలోకపు విందు ఆస్వాద్యమగువేళ
చేదు మ్రింగిన జిహ్వ స్వాదుఖాద్యము మెసవి

కసరుచిగురులకాంక్ష కడుమెక్కి కై పెక్కు
కోకిలమ్మలు సల్పు కుహూ కుహూ రవముల

శ్రుతిపేయముగ గోరి మతియంతయువశమై
నవవసంతాగమనశుభవేళ పులకించి, విచలింప

విచలించి, పులకింప
అవని కామినిదాల్చు
హొంబట్టు టెక్కెమ్ము ఠీవి పెంపెసలార
నయనపర్వము గాగ తిలకించి డెందమ్ము
పింపిళ్లు గూయంగ భారతీయుని తలపు
బరువుగా పరువుగా కదలింది, మెదలింది
మెదలింది, కదలింది

* * *

ఉదయరాగము వరుస మధ్యాహ్నమధురమై
సాంధ్యయోగము బొంది సవరించె నవరుచుల

* * *

చండీశు తాండవము, దర్శించు వేళాయె.
హర ఓం హర ఓం
హర హరా హర ఓం
శంభో మహాదేవ శంకరా శివ శివా
తఋధిగిత, తఋధిగిత ఝణఝణద్ధిమిత
సాంబనృత్యాతంరిత సాంధ్యసమయోచ్చలిత
ఢమరుకనాదప్రధిత ప్రమథలోకోద్ధరిత
ఓంకార ఝుంకార హ్రీంకార, హుంకార
శృంగార క్రేంకార చటులభేరీభాంకార
ప్రళయమరుతోద్గారప్రభంజనాలంకార
కలకలమ్ములు మలగ కలరవమ్ములు సెలగ
ధగధగిత, ధగధగిత ధగధగద్ధగిత
ధళధళిత, ధళధళిత ధళధళద్ధగిత

చంద్రప్రభాస్థపిత సౌదామనీమహిత
విక్రాంతి, భువనాలు ప్రభవింప, విభవింప
విభవింప, ప్రభవించ

మందాకినీకలితమధురసుధాప్లవిత
రసవాహికలు పర్వి ప్రవహించి, ప్రవహించి

జ్ఞానస్నానములందు జగములన్నిటి నోల
లాడించి తేలింప తేలించి లాలింప

భుగభుగలు బుసబుసలు పొగపొగలు సెగసెగలు
ఫణిరాజపూత్కారభూరిభూభృదుద్గార
స్ఫురచ్ఛుభోత్క్రమణాల

ఝృంభించి, ఝృంభించి ఝంఝగతులతో పురుడించి

అలికమ్మునన్ డాగు ముక్కన్ను క్రక్కదలి
సెగలెగయ పొగలెగయ తీంద్రించి వేంద్రించి

ఛటఛట చ్ఛటఛట చ్ఛటులార్భటుల నుమిసి
ప్రబలరంహోద్ధతుల భావి భవకారణమ్మగుచు
భవ్యతేజమ్ములన్ గురిసి పరిఢవింపంగ

సాంబదేవుడు పూని సాంధ్యనాట్యంబాడె
తకధై, తకధై చండీశు తాండవము

కిటతకిట కిటతకిట భృంగిరి మృదంగమ్ము
భం భం బభంభం శంఖప్రణాదమ్ము
సరిగమా పదనిసా తుంబురుని గానమ్ము
గంగడోల్కలదలించు నందీశు నాట్యమ్ము

మంజుమంజులగీతిశింజన్మణీనూపుర
చ్ఛటావిభ్రాంతకాంతిమందహాసోత్ఫుల్లమౌ
మహదేవు నాస్యమ్ము, పరశివా లాస్యమ్ము

హర్షకారణమై యుత్కర్షకాధారముగ
సాంబదేవుడు పూని సాంధ్యనాట్యం బాడ
గమకించి తమకించె భరతఖండస్మృతులు
జగద్భద్రములగుచు లోకశుభ్రములగుచు
తమకించి గమకించె పరవేదసంస్కృతులు
నాకమ్ము లోకమ్ము నందింప స్పందింప
అధ్యయనమండలిగ ఆనందకుండలిగ
అరవిరసి, సెరవిరసి సెరవిరిసి, సెరిగురిసి
విశ్వశ్రేయోహవ్యకవ్యాల హవణించి
లోకకల్యాణవిశ్రేణికలుధమకించి
విశ్వచైతన్యసంస్కారవిభవసంవిద్రూపమ్ము
సహస్రార సచ్చక్రసుధాభాండమ్ము ద్రవియించు
బిందుసందోహము లాని ఆనందజలధిలో
బ్రహ్మానంద పరిధిలో
లయమొంది జయమొంది
రసియించె, రసియించె
జీయాద్భద్రమనుచు ఆనందో బ్రహ్మ యటంచు
జీవాత్మ, పరమాత్మతేజాన శమియించె
జేజేల రమియించె

* * *

ఇది ఉగాది శుభ పర్వవేళ ఇక వెరపేది
సుఖియించి మనుమోయి
నిర్వికార శ్రీల, నిర్నిద్రఆనందరస హేల
వెరపేది సుఖియించి
మనుమోయి మనుమోయి మనుమోయి

# దీపావళి దివ్య శోభలు

దీపాలు దీపాలు దివ్యదీపాలు
పాపతిమిరాల మ్రింగేటి మేటి దీపాలు
కోపతాపాల తరిమేటి కోటి దీపాలు
హర్ష మోదాల కూర్చేటి
దివ్యక్రతు కలాపాలు

దీపాలు దీపాలు దివ్యదీపాలు

క్రాంతివాహికలై పొంగేటి బాలలును
కాంతివీచికలై మెఱసేటి బాలికలు
కలిమిరేఖలుగ మురిసేటి కాంతలును
వెలుగుసంద్రాలై ఎగసేటి పురుషులును
దివ్య దీపావళీ పర్వ శోభల్లు

దీపాలు దీపాలు దివ్యదీపాలు,

సత్యభామాదేవి శౌర్యవిస్ఫురణాలు
భారతీయజ్ఞానసామ్రాజ్యకిరణాలు
శత్రువిదళనయోగ్యమారణాస్త్రాలు
సకలజనసమ్మోదకారణాంకాలు
దీపావళీ దీపతోరణావళులు

దీపాలు దీపాలు దివ్యదీపాలు

అగ్నిభట్టారకుని శౌర్యప్రలాపాలు
వాయుదేవుని వీరప్రతాపాలు
నూత్నవధూవరుల ప్రేమసల్లాపాలు
శుచిదంష్ట్రికా దగ్ధసంవిలాపాలు

దీపాలు దీపాలు దివ్యదీపాలు

# ఒక్క చిన్న దివ్వె

ఒక్క చిన్న దివ్వె
చుక్కవోలె మెఱసింది
శూన్యమ్మందు శుభ్రకాంతి
ధారలను కురిసింది

ఒక్క చిన్న దివ్వె.

ఉవ్వెత్తుగ తలయెత్తుక
మున్ముందుకు నడిచింది
ఉర్విగల్గు జీవకోటి
యౌన్నత్యము చాటింది

ఒక్క చిన్న దివ్వె.

చిమ్మచీకటి శిఖరాలను
తొడకొట్టి పిలిచింది
చెదరిపోని ధైర్యంతో
బెదరగొట్టి నిలిచించి

ఒక్క చిన్న దివ్వె.

ఉసురుడిగిన జీవాలకు
క్రొత్త ఊపిరిచ్చింది
అసురుసురౌ అనదలకు
అభయ హస్తమిచ్చింది

ఒక్క చిన్న దివ్వె.

కండగల్గు దండి మగల
కలవరం పెట్టింది
బెండువడని నిండుతనము
హుందా నిలబెట్టింది
ఒక్క చిన్న దివ్వె.

సత్యమనే ఆయుధాన్ని
చెజేతుల పట్టింది
అసత్యదైత్య శక్తులకు
తలలు చితుకకొట్టింది
ఒక్క చిన్న దివ్వె.

జాతియందు ఐకమత్య
దీక్ష పాదుకొల్పింది
చైతన్యం కేతనాల
విను వీథిని నిల్పింది
ఒక్క చిన్న దివ్వె.

శాంతి సమరనేత యగుచును
స్వాతంత్ర్యం తెచ్చింది
కాంతిపథప్రవక్తయై
కళ్యాణము నిచ్చింది
ఒక్క చిన్న దివ్వె.

అసురభావపోద్ధతికి
గుండె బల్లెమై నిల్చింది

అసహాయ శూరులుగా
ఆత్మజాతి తీర్చింది

ఒక్క చిన్న దివ్వె.

అవినీతిని సమయింపగ
శంఖమ్మై మొఱసింది
ఆత్మ భావదీప్తి, వేగు
చుక్కయై మెఱసింది

ఒక్క చిన్న దివ్వె.

అసత్తునుండి సత్తునకు
సత్యపథము వెలార్చింది
తమమునుండి తేజునకు
వెలుగుబాట తీర్చింది

ఒక్క చిన్న దివ్వె.

మృత్యు భయముబాపి మహికి
అమరభావ మొసగింది
సదసత్తుల కలితమ్మౌ
శాంతవృత్తి నొసగింది

ఒక్క చిన్న దివ్వె.

భేదబుద్ధి తొలగింపగ
శక్తి ధార వోసింది
సౌభ్రాత్రము మహి పెంచగ
ప్రేమ పథము పఱచింది

ఒక్క చిన్న దివ్వె.

అంపశొదుల నేల గూల్చి
అమృతనదుల నిల్పింది
బలురక్కెస పొదల వ్రేల్చి
ప్రణయ నిధుల నెలకొల్పింది

ఒక్క చిన్న దివ్వె.

జాతి మతములకు మధ్య
సయోధ్య పెంచిమించింది
హీనజాతిహేయతను
తెగగోసి మించింది

ఒక్క చిన్న దివ్వె.

లోకాలకు కాంతిరేఖ
యుగుచును దా వెలసింది
మనుజపాళి కాశా
కిరణమ్మై మొలచింది

ఒక్క చిన్న దివ్వె.

దాస్యశృంఖలాలు విచ్చి
తల్లి ఋణము నీగింది
అసురకు ప్రాణమ్ము లిచ్చి
తల్లి యొడిని దాగింది

ఒక్క చిన్న దివ్వె.

అహింసాజ్యోతి యగుచును
కాంతుల వెగజిమ్మింది

హింసకును బలియగుచును తా
తనువర్పణ చేసింది

ఒక్క చిన్న దివ్వె.

మాతృభూమి సేవయందు
మమత పెంచి మించింది
తల్లి సేవ దనువు గపురపు
జ్యోతిగ వెలిగించింది

ఒక్క చిన్న దివ్వె.

ఒక్క చిన్న దివ్వె
చుక్కవోలె మెఱసింది
శూన్యమందు శుభ్రకాంతి
ధారలను కురిసింది

ఒక్క చిన్న దివ్వె.
ఒక్క చిన్న దివ్వె.
ఒక్క చిన్న దివ్వె.

## దీపమయూరి

కాంతి పింఛము విప్పి కదలి నృత్యముచేసె
దీపమాయూరికల్ తేజములు గురిసె

భూనభోంతరము నిండి
పువ్వులై, నవ్వులై
ఎగసినవి శుభ్రభారతీసంస్కృతులు
పగవారి గుండెలలో బాకులౌ కాకరలు॥

చిటపటలు, పటపటలు
చిమ్మచీకటి చైన రక్కసుని
గుండెలను చీల్పగా

చెలరేగి చెలరేగి
కసిరేగి మసిరేగి
వీరక్రీడలు సల్పు
నారకేసరి సటలు

నరకరక్కసు నాల్క చీల్చుకొని పోవంగ
నారి సత్యభామ విడచు అమ్ము, తోసె మినుత్రోవ
సరుమని మ్రోసె కాంతి చిరుమువ్వ
చురుమని చుక్కమనసురేపెను జువ్వ॥

గహనతిమిరము మ్రింగు
లేలిహానుని జిహ్వ
నాల్కలుగ, నాల్కలుగ
వెలుగు చిమ్మెను దిశల
వెల్ల మతాబీ కొనల

కాంచరే, కాంచరే కాంచనాగ్నిచ్ఛటల
ప్రళయనర్తకప్రభునిప్రాభవార్భటుల
పుచ్ఛెలనో, మానవుల హెచ్చులనో, మెచ్చులనో
శబలితాహంకారజీవితపు కచ్చెలనో

నమలి, ఉమియుచునుండె
అంగారకుడు హేళి
ఉర్వరకె మోదమౌ
వీతిహోత్రుని కేళి

కాంతిపింఛము విప్పి కదలి నృత్యము చేసె
దీపమాయూరికల్ తేజములు గురిసె.

## అందమైన అక్షరాలు

అందమైన అక్షరాలు
ఆనందపు కందరాలు
నందనబృందావనాలు
నాదకళాసుందరాలు
శారదామందిరాలు

అందమైన అక్షరాలు

అక్షరమక్షయ్యము
ఆత్మవిభుని ప్రత్యక్షము
అక్షరపరబ్రహ్మ
క్షీణానందసుఖము
నొసగును నేవేళను

అందమైన అక్షరాలు

అక్షరరుచిరాలయమున
హ్లాదమయి వాగ్దేవత
అధివసించి కొలువు దీర్చు
అఖిలజగతి నాదరించు
అజ్ఞానము నపహరించు

అందమైన అక్షరాలు

ప్రణవాక్షరసాక్షాత్కృతి
పరమసృష్టి విలసత్కృతి
పరాశక్తి రుచిరాకృతి

పరమేశుని ఢమరుకధ్వని
పాణిన్యయివుణు ఇక్ శ్రుతి
అందమైన అక్షరతతి॥

వాణీకరకిసలయాప్త
వీణామృదుమంజుధ్వనులు
రాణించే బహుసృష్టిగతులు
దేవమౌని మహతిశ్రుతులు
జగతిని నానందకృతులు

ఛందోఒక్షర రమ్యాకృతి
తంత్రీలయగానఫణితి
శోకమయస్వప్రవృత్తి
ఆదికవి హృదయవృత్తి
శ్లోకమై దనిపెజగతి
సీతాసతి చింతాశత
బాధామయవిధురగీతి
రావణవధోద్గీతవితతి

అందమైన అక్షరాలు

ద్రుపదాత్మజ పరిహాసపు
పరిభవాత్మభారకలిత
కౌరవేయ దుర్జనతను
వాగనుశాసనుండు
రమ్యాక్షరపంక్తినించె
మహాకవి తిక్కనార్య

డక్షరశిల్పకళా
హవ్యమ్ముగ సవదరించె

అందమైన అక్షరాలు

అక్షరగత వాఙ్మయమధు
కోశమె ఈజగతినిండి
ధ్వన్యాత్మత ధరణిదనిపె

సహజసుకవిధౌరేయుడు
భక్తవరుడు పోతనార్యు
డమృతలేఖినిని బట్టి
వర్షించిన భక్తిసుధలు
చిరజీవనసౌందర్యము
మహికొసగిన మహితప్రభలు

అందమైన అక్షరాలు
ఆనందపు కందరాలు
నందనబృందావనాలు
నాదకళాసుందరాలు
శారదామందిరాలు.

## వెలుగు సిపాయి

ఇంట నింట నిలిచె నదిగో వెలుగు సిపాయి
ఇప్పు డింక శత్రువులను పిలిచి గెలువుమోయీ॥

వెలుగు, వెలుగు, వెలుగు వెలుగు వెలుగు తాండవం
విరిసె నిటుల భారతీయ జ్ఞాన వైభవం

అత్యంతము అర్భటించు అగ్ని ప్రతాపం
సత్యభామ వీరకదనకేళికలాపం

భవ్యదీప్తి వెలారించు వహ్ని విలాసం
బాలలయెద మెదలునట్టి పరమసంతోషం

వెల్లువై దిశల కెగయు భాగ్యచందనం
పల్లవించు మానవతా ప్రేమనందనం

పూర్ణతేజమొలయు నిలుచు దీపముకుళముల్
పూజ్య బాపు నెహ్రుల కిడు నమో మాలికల్॥

## పండుగ సందడి

పండుగ పండుగ పండుగలు
మెండగు సందడి దండడులు

కల్గిన వారికి కల్మాలు దండిగ
గర్భదరిద్ర్యుల కటకట మెండుగ
పండుగ పండుగ పండుగలు

ఎక్కడ జూచిన గాజుల గలగలలు
ఇంపులు కురిసే సొమ్ముల ధళ ధళలు॥
పండుగ పండుగ పండుగలు

బాటలు నిండే ముత్తైదువలూ
బారులు తీరిన మదనునికై దువలూ
పండుగ పండుగ పండుగలు

తల్లుల కొంగుల చాటున పిల్లలు
అల్లరి ఆగము కొల్లలు కోకొల్లలు
పండుగ పండుగ పండుగలు

ఇంటను ఇంటను వెలసిన అల్లురు
ఇంటిని వీధికి లాగే జగమల్లురు
పండుగ పండుగ పండుగలు

అంగడి నిండుగ వలచిన అంగనలు
చెంగున ఊరుకు కురంగములు
రంగుల దుస్తుల రంగములు
పండుగ పండుగ పండుగలు

జగమగ వెలిగే ప్రియపు చూపులు
గుండెలు చీల్చే గాలపు తూపులు

పండుగ పండుగ పండుగలు

పచ్చని తోరణ గృహబంధములు
వెచ్చని కౌగిలి వెలయు సుగంధములు
నులి వెచ్చని జంటల ప్రణయపు బంధములు

పండుగ పండుగ పండుగలు

బొమ్మల కొలువుల ధమధమలు
బూరెల గారెల ఘుమ ఘుమలు

పండుగ పండుగ పండుగలు

సందడి పిల్లల కోలాహలములు
కొత్త జంటల వలపుల చెలువములు

పండుగ పండుగ పండుగలు

అల్లురపంతపు కరకరలూ
బిత్తరి చూపుల గరగరలూ
తొలకరి మనసుల తొందరలు
తొలివయసుల సిగ్గుల దొంతరలు

పండుగ పండుగ, పండుగలు
మెండగు సందడి దందడులు॥

# ఈ వసంత నవోదయవేళ

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి హృదయం పల్లవించింది
పల్లించిన ప్రతి హృదయం కోయిల కంఠమై పొంపిరివోయింది.
ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి మనసూ ఉత్సాహంతో ఉరకలు వేసింది.
ఉరకలు వేసిన ప్రతి మనసూ వసంతాలాటలో
ఉక్కిరిబిక్కిరయింది.

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతిభావం మొగ్గలు తొడిగింది.
మొగ్గలు తొడిగిన ప్రతిభావం హరివిల్లై వింతరంగులతో
కాంతులీనింది.

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి కోరిక పువ్వులు పువ్వులై నవ్వులు నవ్వింది.
పువ్వులై నవ్విన ప్రతి కోరిక, పున్నమి వెన్నెలవాకయై
మిన్నూ మన్నూ ఏకంచేసింది.

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి ఊర్పూ పరిమళించింది
పరిమళించిన ప్రతి పూర్పూ మల్లీసుమమై
మత్తెక్కించింది.

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి చేష్టా క్రొత్త రూపులు దాల్చింది
క్రొత్త రూపులు తాల్చిన ప్రతి చేష్టా కర్మయోగమై
పచేళిమయింది.

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి తనువూ పరవశమయింది.
పరవశమైన ప్రతి తనువూ రసతుందిలమై పరితృప్తిని పొందింది.

ఈ వసంతనవోదయవేళ
ప్రకృతిలో ప్రతి జీవీ స్పందన పొందింది
స్పందన పొందిన ప్రతి జీవీ చైతన్యచైత్రరథమై
జాతర సల్పింది.

ఈ వసంతనవోదయశుభవేళ
ప్రకృతిలో ప్రత్యణువూ, ప్రతి క్షణమూ నవనవోల్లాస
భరితమయింది
నవం నవమై ఉత్ఫుల్లతనందిన ప్రత్యణువూ ప్రణయరాగమై
ప్రాణికోటి సంతర్పణ చేసింది.

## విషధయోగ్యులను చిర్మించాలి
## శశవిషాణమైనా సాధించాలి

నలవర్షపు తొలిఉషస్సు
నరజాత్యభుదయ మహస్సు
నవసమాజస్థాపనకై ప్రభవించిన
శుభ్రరోచిస్సు
నయపథపరివర్తనకై వఱచికొన్న
ఇంద్రధనస్సు
ఈ నల వర్షపు తొలి ఉషస్సు

తూరుపు రేఖలు విరిసిన కాంతులలో
ఊరుపునించుకొని సుఖశాంతులతో
కూర్పగవలె మాతకు కుంకుమతిలకం
తీర్పగవలె దేశమాతకు మంగళార్తికం.

విశ్లథమైన శిథిలజీవితా లీ సుషమలో
వృథుల తేజాన్ని వుంజుకొని పదిలపఱచు
కొంటూన్నాయి.

మోడుబారిన మ్రాకులక్రింద తారాడే కీనీడలు
కదలి కదలి
వాసంతిక క్రీడా చిద్విలాసపుహొయలు పచరిస్తున్నాయి

అభ్యుదయ విపంచిమొలసిన
ఈ సుప్రభాతగీతనినాదంతో
అవినీతి, అక్రమపాలన, అన్యాయార్జన
అంతమొంది

భవితవ్యానికి రాచబాటలు
అవితథంగా పఱచుకొంటూన్నాయి.

ఈ నిర్విశంకనిర్మాణపథంలో
మందమంద మైన మనుజుల మనుగడ మాయమై
అమందానందమందిరకవాటాలు తెఱచుకొంటున్నాయి.

ఈ విముక్త మందిరంలో

బందిఖానా విడిచి, బంధాలువిడిచి
మానవుడు, మాధవుడౌతున్నాడు.

అపుడే వ్రజలకు పర్వం. అదియే మనసర్వం.

ఈ సాధనలో
నిషధయోగ్యులను నిర్మించాలి
దేశంకోసం, దేశాభ్యుదయంకోసం
శశవిషాణమైనా సాధించాలి.

## యువతరానికి స్వాగతం
## నవశకానికి రుచిరాగతం

బలవంతులపిడికిలిపోట్లు
బలహీనపు గుండెల రక్తాన్ని చవిచూస్తున్నాయి.

దాంభికత్వపు దౌర్జన్యం
ఆర్జవాన్ని అటకాయిస్తూన్నది.

కుటిలనీతిపాటవం
పటుతర ధర్మశక్తిని బరిలోకి లాగుతూ ఉన్నది.

స్వార్థపరుల సంఘవాదం
సాధుత్వాన్ని అగాధంలోకి తోసేస్తూ ఉన్నది.

మాటల నైపుణ్యం
నిజాయితీని పోటు పొడుస్తూ ఉన్నది.

మెఱమెచ్చుల సంఘబలంముందు
యదార్థవాదం గెలువలేక వ్యర్థమౌతూ ఉన్నది.

పదవి నా వేశించిన బలమూ పలుకుబడీ
పెదవులు కొఱుకుతూ
పేదల బ్రిదుకుల్లో నిప్పులు చెరుగుతూ ఉన్నది.

రాజకీయ చైతన్యం పఱచిన రంగుల హరివిల్లు
అమాయికప్రజానీకం అంగిట్లో వరిముల్లై
దిగబడిపోయింది.

అయితే ఇప్పుడిక

పింగళస్వామి పాలనలో
విశ్వమంగళగీతికాలాపనధ్వనులు
దిక్కులు పిక్కటిల్లినవి-

విధురమైన బ్రిదుకులలో
మధురోహల మలుపు తిరిగింది-

చేదువడ్డ జీవితాలకు
స్వాదుపథం పఱచుకొన్నది

ఉప్పొరిసి, ఉర్వినికూలిన ఉప్పరిగలలో
కప్పురపు దీపాలు కాంతులు నింపాయి.

పుల్లవడిన ఉల్లాలన్నీ
ప్రఫుల్లమై విలసిల్లాయి.

కసటైపోయిన నగరంతా
ప్రగతిపాలనలో పొగరుజూపింది.

అంతరంగ ప్రాంచికడిగి
విమలభావనాలావణ్యదీధితులను పచరించే
ముత్తెపు దొంతర్ల ముగ్గులుబెట్టి
విశ్వశ్రేయాన్ని ఆమతించే
శుభకామనల తోరణాలు తీర్చిదిద్ది
భారతి, లోకమంగళగీతికి
గళం సవరిస్తూ ఉన్నది.

భవిష్యదర్థానికి బంగరుబాటలు వెయ్యాలి
భారతమాతకు హారతు లియ్యాలి-

మేలుకొన్న యువతరం
గీలుకొన్న మేలుసెంచి
మెరవణి సాగాలి.

రండీ యువతీ యువకులు
సాగిపొండీ శ్రేయస్సాధనకై
ఇదే ఇదే
యువతరానికి స్వాగతం
ఇదే ఇదే
నవశకానికి రుచిరాగతం.

## ఆనందునకు స్వాగతం

ఆనందా నీవు వచ్చావా! నిజంగానే వచ్చావా!
అభ్యుదయం తెచ్చావా! అడుగడుగునా పటిచావా?
ఆనందా నీవు వచ్చావా!

ప్రమాది వలన ఇంక ప్రమాదం లేదనే
ప్రమోదవార్త తీసుకొని వచ్చావా?
ఆనందా నీవు వచ్చావా!

మా అవ్వ చెప్పిందిలే
అప్పుడు, వెనుక నీవు వచ్చినప్పుడు
ఆమ్రఫలాలలో రసహృదయం ఆమ్రేడితమై ఉండేదనీ
శుకపికగళరవాల్లో శుష్కవాగాండరదంభప్రలావన లేదనీ!
మల్లెల్లో సౌరభ సౌందర్యం వెల్లివిరిసిందనీ
అంతటా
ఆనందం అర్ణవంగా పొంగిందనీ!

* * *

మఱి యిప్పుడో ఆనందా!
కఱవులో కాలు పెట్టావు! కాటకం కాటు వేస్తుందేమో!
కఱవెక్కడున్నదీ? భూమాత భూరిగా పండుతూంటే"
అంటావా?

ఉన్న కరువల్లా మా భావాల్లో! మా మస్తిష్కంలో!
మా చేతల్లో! మంచితనానికి నోచుకోని మా సంఘంలో!
నిజాయితీ లేక, యిజాలతో బుజాలు తడుముకొంటూన్న
రాజకీయాల్లో!

శాంతి పావురాలకు మారురూపంగా
మారణయంత్రాల్ని ఎగురవేసు కొంటూన్న
విజ్ఞానుల మేధస్సులలో!
కొంచెం వెనుకముందు అవగతం చేసుకొని
"త్యాగేనైకే నామృతమశ్నుః" అన్న నానుడిని
అర్థం చేసుకొని
స్వార్థం విడచి మఱీ సాము చేయవలసి వస్తుందేమో!
తనకు మాలిన ధర్మంగా మేము రోజూ చేసేపనే యిది

అందువలన సాహసించి
నీకు సలహా యిస్తూన్నా!
ఏం చేస్తాం

నిత్య జీవితాల్లో, నిత్యావసరాలు, ఏవీ దొఱకకపోతే
అదంతా త్యాగమే!
గాలికి పోయిన పేలపిండి రామార్పణమే గా మఱి!
అయినా ఎందుకులే ఈ సొదంతా!
వస్తూనే, తేనెల సోనలు కురిసే తెలుగుతల్లికి
పట్టాభిషేకనృత్యం చేస్తూ
అందాలు చిందే అందెలరవళితో మా డెందాలకు
ఆనందాభిషేకం చేశావు!
నీ మోపిన అడుగుజాడలో ఆంధ్రులకు అభ్యుదయానంద
పరీవాహంలో మున్కలు వేయించావు!
అదిచాలు! ఆనందా! అదిచాలు

## రాగాలయావారి భోగమహల్

రాగాలయావారి భోగమహల్లో
రాగ రాగిణులు, భోగమోహినులు
అంగాంగ వైభవాలన్నీ
శృంగారంగా చిందిస్తూ

ప్రభారంజనంగా, జనతాప్రియంగా
నృత్యంచేస్తూ, మజామజారాయుళ్ల
ఖజానాలన్నీ హజామత్తుచేసేస్తూన్నారు
రక్తపుటేర్లల్లో నవ్వే రాజకమలాలను
భోజనంచేసే దేవతాపూజారులంతా
రాగరాగిణి ధరించిన దేవతా వలువల
విలువలు కట్టడానికి
భోగమోహిని ఒయారం ఒలకబోస్తూ
పంచిపెట్టే నిషాకషాయం హుషారుగా
రుచిచూడడానికి
మత్తుగా, గమ్మత్తుగా చిత్తాన్ని గుత్తకు తీసుకొన్న
ఘత్తకాశినులైన ఆ పుత్తడి బొమ్మల
మెత్తనిమేని అందాలను పురిషిఫ్ఫతో
త్రాగడానికి
రక్తపుటేరుల్లో నవ్వేన రాజ కమలాలను
చెంచుపుటాలతో పొడిచి ఆస్వాదించే
పైశాచపు ఆసామీలంతా
రోల్స్‌రాయిాస్ కారులలో, విమానాలలో
రొప్పుకుంటూ రోజుకుంటూ
గాజుబారిన కళ్ళతో, బూజుపట్టిన మనస్సులతో

జుంజురు తలలతో, జింజరు కైపులతో
పోటీలు పడ్తూ పరుగుపందేలకు తలపడ్డారు.
వాడవాడలా
ఆ వాడవదినల పోడుముల ముచ్చటలే
గోడగోడలా
ఆ కులుకులాడుల ఒయారపు ఒంపు సొంపులే
కమ్మని కలాలతో, కంకణహస్తాలతో
మనోరథాలూరిస్తూ, రథాలపై ఊరేగిస్తూ
కథలు కథలుగా ఆ కకుభవస్త్రల గాథలే

చిత్ర కథల చైత్రరథయాత్రలు
ధరిత్రినంతా ఒక ఊవు ఊపేస్తున్నాయి

వగరు వగరు పొగరులతో, పొగరు పొగరు తొగరులతో
నడిరోడ్డున పడి కాటేసిన యౌవనపు సిరితో
సరి బేసు అంటూ

చెంగావి చీరలలో
బంగారపు వయసు వరువం
శృంగాటకం ఆడ్తూంటే
ఛెంగున గంతులేసే

పోటు మానిసుల కోసం పోడవు మానిసులాడే
పోరాటాలతో

ఈ విశాల విశ్వం విస్తు పోతూంది!

* * *

పాఠకులారా! శ్రోతలారా!
ప్రేక్షకులారా సభ్యమహాశయులారా

ఈ మన్మథలీలాస్మరణంలో తలమునక లౌతూ ఉన్నారా
అయ్యలారా! అమ్మలారా!
మనం మసిలే ఈ మహీతలమహిమాన్విత
చరిత్రనే మఱచిపోయారా
త్యాగాలయావారి యోగభూమిలో

ఆర్ష జీవన రాగిణుల అంతస్సౌందర్యవాహికలు
ఆత్మచైతన్యంతో ఆనంద నర్తనం చేస్తూంటే
అనిమేషనయనాలతో, అఖండభక్తితో
అపూర్వ గౌరవాన్ని పచరించే ఆర్యమహాశయుల
ఆవాస మైన అతిపవిత్రభూమి ఇది!!

మనం!
ఈ మానవులం!
మస్తిష్కం కల మాన్యమూర్తులం!

ఈ మాన్య ధరిత్రీమాత ప్రసవించిన మహా
పవిత్ర మూర్తులం!
గుర్తు చేసుకోండి
గతాన్ని గళదఘ్నంగా మననం చేసుకొండి.

# గోదావరి పుష్కరమ్ము

గోదావరిపుష్కరమ్ము, కోట్ల ప్రజకు శుభవరమ్ము
నేలతల్లి నవ్వినట్లు పాలసంద్ర మెగసినట్లు
జన సందోహము జన సందోహము
ఘన సంతోషము, ఘన సంతోషము!

నేలతల్లి యీనినట్లు
పాల సంద్రమెగసినట్లు
జన సందోహము
ఘనసంతోషము

రాము పాదపరివస్యను పూతమైన గోదావరి
కామధేను పొచు వ్రజల కామితముల దీర్చుచుండు
పూతమైన మహాతల్లి పుణ్యమహితదివ్యవల్లి!
గౌతమీజలమ్ము లందు పుష్కరమ్ము ప్రవేశించె
మహాపర్వపుష్కరమ్ము అహో పొగడ దుష్కరమ్ము

నేలతల్లి యీనినట్లు
పాలసంద్ర మెగసితెట్లు
జన సందోహము
ఘన సంతోషము!

నడయాడే హరివిల్లులు, పరిమళాల సిరిమల్లెలు
ప్రతివీధిని ప్రత్యంగణప్రాంత మందు పారాడే
పడతుల బలు తీవి సొరు! భక్తజనుల పెనుబారులు
అల్లవిగో రామకృష్ణ మఠసాధుల సేవాశ్రమ
మల్లవిగో కనుగొనుడీ, సత్యశాయి సేవాకేంద్ర
వైద్యశాల, లదె కనుడీ జియరుస్వామి యజ్ఞవాటి

వైకుంఠము నుండి భువిని నవతరించు
కలియుగమ్ము నాయకుండిచ్చటనే అధివసించె
విభవోన్నతపరదైవము వేంకటేశనాథుం డిపు
డయ్యలార, అమ్మలార, అధికభక్తి నా స్వామికి
పూజచేసి తరియింపుడు పున్నెమలర పూజింపుడు?

తీర్థవిధుల తీవ్రభక్తి నాచరించు యాత్రికగణ
మభ్యంజనమాచరించు భక్తజనుల సందోహము
లక్షలు గా నేతెంచియు సందడించి గందడింప
రాజమందిరమ్ము మిగుల రమ్యమౌచు శోభ గొనియె
మహామహుల బోధలతో పావనమై పరిఢవిల్లె

తనజీవన రసవాహిని, తన తనూవిలాసరేఖ
ఆదికావ్యభారతిగా, భరతదేశసస్యకోశ
సంపదగా ఆంధ్రజనుల విభవమ్మును చాటుచుండ
తన బిడ్డల కూర్మి సాకు వరగౌతమి, వరపుష్కర
తీర్థరాజు గూడి, అధికభాగ్యోదయ కారణమై

భక్తి మునుగు భరత ప్రజలపున్నెమ్ముల తేల్చివైచె
పాపమ్ముల దుల్చివైచె మహాపర్వపుష్కరమ్ము
అహో పొగడ దుష్కరమ్ము
కోటిలింగవిభుని గొలిచి, వరమార్కండేశు గొలిచి
పుష్కరతీర్థఘట్టమున కొలువు సేసియున్న
గోదావరి మాత గొలిచి, దోయిలించి తీర్థజలము
శిరముపైన స్వీకరించి, భక్తగణము లక్షలుగా
తాన మాడి, మురిసి, మురిసి ముక్తులైరి మోదమంది
వేదనలను విస్మరించి వేడుకతో తనివిసనిరి.

## దీ ప క ళి క

ఇంకా ఉషఃకాంతులు వసుంధరాదేవికి చక్కిలిగింతలు పెట్టలేదు.

నిద్రా, స్మృతీ, కాని సంధ్యావస్థలో కొట్టుమిట్టాడుతున్నాను.

ఏమిటో గుండె గుహల్లో ఒక చైతన్య స్పందన కల్గింది. ఆ స్పందన తీవ్రత ఒక ప్రేరణగా బయటకు నడిచివచ్చా!

బయట....ఓహో! అనంత ఉజ్వల నీలాకాశం! ఏదో ఉత్సాహ వాతావరణం నన్ను ఉల్లాస పరచింది!

ఒక్కమారు రెక్కలు విప్పుకొని నా మెదడుబందికానాలో నుంచి హంసలు బయటకు దూకి, దూది పంజల్లా పైకి పైకి తేలిపోతూ, ఎగిరిపోయాయి.

అరే - అదేమిటీ చోద్యం! వినీలసాంద్రాకాశం నిండా హంసలే. హంసలే హంసలు!

ఇంతలో ఎంత అందమైన పూలపాన్పు తయారైనదీ; గగన రంగంలో! ఏ చిద్విలాసుడు పవ్వళిస్తాడో! దానిపైన!

ఆ శోభాసౌందర్యదర్శనంతో ఉక్కిరిబిక్కిరై సర్వేంద్రియాలూ పట్టుదప్పి వివశమై పోతూంటే సౌరభాల ముసుగు ఆవరణతో ఎవరో దొంగ కాబోలు: వచ్చి విజృంభించాడు! ఎవరీ దొంగ? ఏమిటీ అల్లరి! అనే ఆలోచనలకే అవకాశం లభించకుండా ఆ దొంగ నాసొపుటా

ల్లోంచీ, నేత్రాంచలాల్లోంచీ లోపలకు, లోపలకు ఇంకా లోపలకు అంత స్సుల్లోకి, దిగి మరీ తిష్ఠ వేశాడు!

ఆ అనంతకాంతిసౌరభవీచి ఈ చిన్న యింటిలో, ఇమిడే అవకాశం లేక రెపరెపలాడింది. ఉన్న ఊపిరి కాస్తా క్రిందా మీదా అయి, సతమత మయింది.

అయినా లోపల చేరిన చోరుని ఎట్లాగైనా బంధించాలనీ ఊపిరి బిగబట్టాను వాడెక్కడ పర్దుకున్నాడో నాకైతే తెలియలేదు.

కాని ఆ ఉజ్జ్వలకాంతి సౌరభవీచి, దీపకళికలా నాలో నిలిచి పోయింది.

—

మాతృశ్రీ ప్రింటర్సు, స్టేషన్‌రోడ్, బాపట్ల - 522 101.



జననము
1917 డిసెంబరు

జననీ జనకులు
నాళము సుశీలమ్మ
మధురకవి :
నాళము కృష్ణారావు
రాజమండ్రి

భర్తగారు
శ్రీ ఊటుకూరి హయగ్రీవ
ఎడ్వకేట్, బాపట్ల

కళాప్రపూర్ణ : ఆంధ్ర సరస్వతి
**డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ**

ఇతర రచనలు :

(1) ఆంధ్రకవయిత్రులు
(2) అఖిలభారతకవయిత్రులు
(3) శ్రీ కన్యకాపరమేశ్వరీసుప్రభాతము
(4) దేవీస్తవతారావళి
(5) జాతిపిత
(6) మన సాహితి - మధుభారతి
(7) కాంతిశిఖరాలు
(8) కన్యకమ్మనివాళి
(9) మహిళా విక్రమ సూక్తము
(10) సదుక్తి మంజరి
(11) లజ్జా కిరీటధారిణి

# ఒక్క చిన్న దివ్వె

ఆంధ్ర సరస్వతి, కళాప్రపూర్ణ
డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ